# కాళిదాసు మేఘ సందేశము - 02

(వ్యాఖ్యాసహితము)

- డా॥ తాడేపల్లి పతంజలి, 9866691587

**శిష్యుడు:** శ్రీ గురుభ్యో నమః

**గురువు:** సమస్త సన్మంగళాని సన్తు. మనం మేఘ సందేశ కావ్యంలో ఎంతవరకు చెప్పుకొన్నాం?

**శిష్యుడు:** మూడు శ్లోకాలు పూర్తయ్యాయి స్వామి! శాపం వల్ల సంవత్సరం పాటు ప్రియురాలికి దూరమైన యక్షుడు పర్వతము పై ప్రదేశాన్ని కౌగిలించుకొన్న ఒక మేఘాన్ని చూసాడు. ఇంతవరకు పూర్తయింది.

**గురువు:** సంతోషము... నాలుగవ శ్లోకం చదువు

**శిష్యుడు:** ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలమ్బనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ ప్రవృత్తిమ్
స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతిప్రముఖవచనం స్వాగతం వ్యాజహార 4

**గురువు:** శ్రావణ మాసము దగ్గరపడుతోంది. ఎనిమిది నెలలుగా తనకు దూరమైన ప్రేయసి ఎలా ఉందో అని యక్షునికి బెంగపట్టుకొంది. తనకు కనబడిన మేఘముతో ఆమెకు క్షేమ సందేశం పంపించాలనుకొన్నాడు. ముందుగా అప్పుడే వికసించిన కొండ మల్లె పూలతో అతిథి సత్కారం చేస్తూ, తన ప్రేమ పూర్వకమైన మాటలతో ఆ మేఘానికి స్వాగతం పలికాడు.

**శిష్యుడు:** గురువుగారూ! **'కుటజకుసుమైః కల్పితార్ఘాయ'** అన్నాడు. అసలు అర్ఘము అంటే ఏమిటి? అర్ఘము ఎందుకు ఇవ్వాలి?

**గురువు:** అర్ఘము అంటే పూజించుట. పూజకు తగినది. సాధారణంగా పూజలో వాడే నీటిని 'అర్ఘ్యం' అంటున్నారు. కాని ఎనిమిది రకాల అర్ఘ్యాలు ఉన్నాయి. పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గరిక, నువ్వులు, దర్భలు, పూలు. వీటిలో పూలతో మేఘానికి అర్ఘము ఇవ్వాలని యక్షుడు తలచాడు. ఒకరికి పూజ చేయటం - ఆయన మంచి కోసం కాదు. మన మంచి కోసం.

**శిష్యుడు:** స్వాగతము. సుస్వాగతము అని రెండు పదాలు వింటున్నాను. కాళిదాసు ఈ శ్లోకంలో స్వాగతం అన్నాడు. స్వాగతమా? సుస్వాగతమా? ఏది సరియైనది?

**గురువు:** ఆదరముతో చేసే ఆహ్వానానికి స్వాగతము అని అంటే సరిపోతుంది. 'సు' చేర్చి సుస్వాగతము అని చెప్పనక్కరలేదు. తరువాతి శ్లోకం అందుకో!

**శిష్యుడు:** ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః!
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః!
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు 5

**గురువు:** పొగ లేక ఆవిరి, అగ్ని, నీరు, గాలి మొదలైన వాటి వికారమైన, కలయిక అయిన మేఘం ఎక్కడ? సమర్థాలైన ఇంద్రియాలు గల ప్రాణులతో పంపదగిన వార్తా ప్రయోజనాలు ఎక్కడ? ఉత్సాహము చేత ఇది లెక్కబెట్టక, యక్షుడు, ఆ మేఘాన్ని తన క్షేమవార్తను ప్రియురాలికి చెప్పమని యాచించాడు. అవును! అంతే కదా! కామ పీడితులు, చేతనాచేతన విషయాల్లో స్వభావంచేత మూఢులు. అనగా తెలివిమాలినవారు.

ఏమండీ! మేఘానికి ప్రాణం ఉంటుందా? మనం చెప్పే సందేశం అది వినగలదా? విన్న దానిని వేరొక చోట చెప్పగలదా? అని మనకు ప్రశ్న వస్తుంది. మహాకవి మనకు రాబోయే ప్రశ్నను ముందుగానే వేసుకొని దానికి ఈ శ్లోకంలో జవాబు చెప్పాడు.

కామము అంటే ఒకరి మీద ఉంటే కోరిక, మోహము. ఇది యుక్తా యుక్తాలను- అంటే న్యాయాన్యాయాలు, మంచి చెడులను పట్టించుకోదు. యక్షుడు తన ప్రేయసి మీద కామముతో ఉన్నాడు. అందువల్ల వాడికి మేఘానికి 'మనం చెప్పేది వినబడుతుందా? అది వింటుందా? - ఇలాంటి వేవి ఆలోచించలేకపోయాడు. ఎందుకంటే కామము వాడి బుద్ధిని కప్పివేసింది.

ఇక్కడ మహాకవి కామము ఎంత చెడ్డదో లోకానికి సందేశమిచ్చాడు. అది మంచి చెడులను ఆలోచించనీయకుండా చేస్తుంది. జాగ్రత్త అని హెచ్చరించాడు.

## సద్దిమూట

రామయణమనగానే
నీలో వున్న రామసేతువు చూపిస్తావు
మహాభాగవతమనగానే
నీగర్భంలో వున్న ద్వారకను చూపెడతావు
లక్ష్మీదేవి అనగానే
నీ లోపలవున్న అపార సంపదల్ని చూపెడతావు
భూదేవి అనగానే
నీపక్కనే చూపెడతావు
పురాణాల్ని ఇతిహాసాలని చెప్పాలంటే
(పురాణాలు = epics, ఇతిహాసాలు = history)
నీ ముద్ర తప్పదల్లె వుంది సముద్రా!

గోలి రామ్మోహన్ రావు
సెల్: 9849337204

**శిష్యుడు:** గురువుగారూ! అడిగాడు అంటే సరిపోతుంది కదా! 'యయాచే' అని కవి ఎందుకన్నాడు?

**గురువు:** యాచన, అభిశస్తి, అర్థనా - అనే మూడు పదాలకు అడుగుట అనే అర్థాన్ని చెప్పింది అమరకోశము. కాకపోతే దైన్యంతో వేడుకొనటాన్ని - మనం- ఈనాడు యాచన అంటున్నాము. యక్షుడు బాధలో ఉన్నాడు కాబట్టి, వాడిలో వేదన యాచనగా మారింది. అందుకే కవి 'యయాచే' అన్నాడు.

**శిష్యుడు:** ఆవిరి, అగ్ని, నీరు, గాలి మొదలైన వాటితో మేఘము అవుతుందని కవి అన్నాడు. మేఘములో అగ్ని ఉంటుందా?

**గురువు:** ఎందుకుండదు? అగ్ని లేని ప్రదేశమెక్కడ? సూర్యునిలో రశ్మి రూపంలో ఉంటుంది. నీటిలో జల విద్యుత్తుగా ఉంటుంది. 'వైద్యుస్సంధానం' అని మేఘములోని విద్యుత్తును అగ్నిగా యజ్ఞములో చెప్పారు. నీరు సూర్యరశ్మివల్ల ఆవిరి అయినపుడు ఆ నీటి ఆవిరిలోని సూర్యాగ్ని మేఘములో విద్యుత్తు అవుతుంది. తర్వాత శ్లోకం చదువు.

**శిష్యుడు:** జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః
తేనార్థిత్వం త్వయి విధివశా ద్దూరబన్ధు ర్గతోఽహం,
యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా 6

**గురువు:** పూర్వ మేఘములోని ఆరవ శ్లోకం ఇప్పుడు చదువుకొంటున్నాం.

**శిష్యుడు:** పూర్వ మేఘము అంటే?

**గురువు:** మేఘ సందేశ కావ్యం మొత్తం 124 శ్లోకాలు. అందులో మొదటి 67శ్లోకాలను పూర్వ మేఘం అంటారు. తర్వాత 57శ్లోకాలను ఉత్తర మేఘం అంటారు. నువ్వు చదివిన పూర్వ మేఘంలోని ఆరవ శ్లోకానికి భావం ఇది.

యక్షుడు మేఘంతో అంటున్నా. ఓ మేఘమా! ప్రళయ కాలములో విపరీతంగా వర్షించే పుష్కలము, ఆవర్తకము అనే మేఘాలు పుట్టిన కులములో పుట్టిన వాడివి నువ్వు. కోరుకున్న రూపాన్ని ధరించగల శక్తి నీకు ఉంది. ఇంద్రుడి ఆస్థానములో ప్రధాన పురుషుడివి నువ్వన్న విషయం నాకు తెలుసు. ఇలాంటి గొప్ప గుణాలు నీలో ఉన్నాయి కనుకనే నేను నిన్ను వేడుకొంటున్నాను. గుణ సంపన్నుని వేడుకొన్న యాచన ఫలించినప్పటికీ కొంతవరకు మంచిదే. అధముడిని వేడుకొన్న యాచన ఫలించినా అంత మంచిది కాదు.

కాళిదాసు ఈ శ్లోకంలో చెప్పిన విషయాలలో కొన్నింటిని ఈనాటి కమ్యూనికేషన్ స్కిల్స్‌కి (భావప్రసార నైపుణ్యాలు) మనం అన్వయించుకోవచ్చు. ఒకరిని ఒక పని అడుగుతున్నప్పుడు మొట్టమొదట వారి వంశంలోని పూర్వీకులమంచి గుణాలను తలిస్తే వారు చాలా సంతోషిస్తారు. మీ తాతగారు అలాంటి వారు... మీ ముత్తాతగారు ఇలాంటి వారు అని చెబితే దాత మనస్సు తెలియకుండానే సంతోషంతో నిండి పోతుంది. రామునికి ఎన్ని పేర్లున్నా దాశరథీ (దశరథుని కుమారుడా!) అని పిలిస్తే చాలా సంతోషపడతాడట. అందుకే రామదాసు గారు దాశరథీ! కరుణాపయోనిధీ! అన్నాడు. ఆ పద్ధతిని అనుసరించి యక్షుడు ఇక్కడ మేఘము యొక్క పూర్వీకులను తలచాడు. ముందు పెద్దల గొప్పతనాన్ని చెప్పి, తర్వాత మేఘము గొప్పతనాన్ని చెప్పాడు. ఇది మనం బాగా గమనించాలి.

దాతలు మూడు రకాలు. 1. దాత, 2. ఉదారుడు, 3. వదాన్యుడు. ఎవరైనా వచ్చి అడిగితే ఎంతో కొంత ఇచ్చి పంపేవాడు దాత. అడిగినవారి అవసరాన్ని గుర్తించి, అడిగినదాని కన్నా కాస్త ఎక్కువగా ఇచ్చేవాడు ఉదారుడు. అవతలవాడు అడిగేదాకా కూడా ఆగకుండా, అవసరం వచ్చిందని, తెలియగానే చేతనైనంతా ఇచ్చేవాడు వదాన్యుడు.

యక్షుడు వర్ణించిన మేఘుడు మూడో తరగతికి చెందిన వదాన్యుడు. మేఘం - ఎవరూ అడగకుండానే వర్షం కురిపించి భూమిని సస్య శ్యామలం చేస్తుంది. అందువల్ల గుణ సంపన్నుని వేడుకొన్నప్పటికీ యాచన ఫలించినప్పటికీ కొంతవరకు మంచిదే అని కవి కంఠోక్తి. ఏదో చెప్పబోతున్నావ్?

**శిష్యుడు:** మేఘ సందేశంలోని మొదటి శ్లోకంతో భారత ప్రభుత్వమువారు తపాలబిళ్ల ప్రచురించారట కదా!

**గురువు:** అవును. ఇది మేఘ సందేశ కావ్యానికి దక్కిన అపూర్వ గౌరవము.

**శిష్యుడు:** గురువుగారూ! 'మేఘ సందేశము' సరియయినదా? 'మేఘ సన్దేశము' సరియయినదా?

**గురువు:** వ్యాకరణ ప్రకారము మేఘ సన్దేశము సరియయినది. లోక వ్యవహారము ప్రకారము మేఘ సందేశము సరియైనది. అచ్చును అనుసరించి వచ్చేదానిని అనుస్వారము లేక సున్న అంటారు. అనుస్వారము తనకు పరమైన వర్గాక్షరాలనుబట్టి అయిదవ అక్షరాన్ని గ్రహిస్తుంది. మన సందేశములో ద 'తవర్గకి' చెందినది. త వర్గానికి చెందిన పంచమాక్షరము (త, థ, ద, ధ, న) "న". కనుక సందేశములో సున్న ఎగిరిపోయి "న" వచ్చి సన్దేశము అవుతుంది. అందుకే కొంతమంది పెద్దలు తమ పేరును చన్ద్రశేఖర శాస్త్రి అని సున్నా లేకుండా వ్రాసుకొంటుంటారు. లోకంలో ఎక్కువమంది సందేశము అంటున్నారు కాబట్టి మనం కూడా సందేశము అన్నాము.

ఈ రోజుతో ఇక్కడికి విరమిద్దాం. తర్వాత శ్లోకాలలో కుబేరుని ముఖ్య పట్టణమైన అలకాపురిని కాళిదాసు వర్ణించిన తీరు చూసి సంతోషిద్దాం. స్వస్తి.

✲

 